Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU

PATRONS

1. K. B. MADHAVA Esq., M. A., A. I. A., (Lond.) F. R. A. S.
CONSULTING ACTUARY
Professor and Head of the Dept. of Mathematical Economics and Statistics,
MYSORE UNIVERSITY, MYSORE.

2. A. KALESWARA RAO PANTULU, Esq., B. A., B. L.,
BEZWADA.



VOL. V BEZWADA—DECEMBER 1936 No. 12

# భీమా పత్రిక


గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఎ. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. ఏ., బి. యల్.

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.


## భీమా పత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోస్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన ప్రచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు, విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు:—మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

### BUSINESS NOTICE.

The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas. Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India)

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అను పేరుకు దాహరింపవలసినదిగ కోరుచున్నాము

శ్రీయుత ..........................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,
తే 29—12—36.

మేనేజరు.
భీమాపత్రిక.




# ప్రభుత్వమువారి ప్రత్యేక భీమావ్యాపారశాఖ

**(Separate Government Insurance Department)**

నూతనముగ ప్రకటింపబడిన ప్రభుత్వము వారి బ్లూబుక్ ననుసరించి హిందూదేశములో 201 (రెండువందలఒకటి) జీవితభీమాకంపెనీలు కలవు. యీ కంపెనీలవ్యాపార మంతయు డైరక్టరుగా యిండియా ప్రభుత్వము వారితనిఖికి లోబడి యున్నది. ఈ భీమాశాఖ గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డిపార్టుమెంటువారిఅధీనములోనుండి సర్కారుచే నియమింపబడిన భీమాశాస్త్రవేత్తచే నడుపబడుచున్నది. ఇండియాప్రభుత్వమువారి యిండస్ట్రీస్ అండ్ కామర్సు డిపార్టుమెంటునుండి యీ వ్యాపార అజమాయిషీని విడదీసి ఒక ప్రత్యేక భీమాశాఖ (Separate Insurance Department) నేర్పాటుచేయవలసినదిగా చాలమంది కోరుచున్నారు. దేశ సౌభాగ్య సంపదకు ప్రధానమైనట్టియు ఆసేతు హిమాచల పర్యంతము వ్యాప్తమై దినదినాభివృద్ధిగాంచుచున్నట్టి యీవ్యాపారమునకు యీబాహుళ్య వ్యాపారము చక్కగ నడచునట్లు చూచుటకు ప్రభుత్వము వారి ఒక ప్రత్యేకభీమాశాఖ నెలకొల్పుట ముఖ్యావసరమనుటలో హాస్యాస్పదమెంతమాత్రము లేదు. ఈ వ్యాపారమును చక్కగ నడుపుటకు ఒక ప్రత్యేక ప్రభుత్వము వారి భీమాశాఖ నెలకొల్పుట చాల ముఖ్యావసరమై యున్నది. కాని యీశాఖను నడుపుటకు చాలఖర్చులు ప్రతిసంవత్సరమును తగులుచా టగును. ఈ ఖర్చులు యిండియాప్రభుత్వము వారు భరించుటయా లేక యిన్సూరెన్సు కంపెనీలవారు భరించుటయా అనే విషయము చాలముఖ్యమైనది. ఇదివరలోనే ఎక్కువఖర్చులతో వ్యాపారము నడుపుచున్న యిన్సూరెన్సు కంపెనీలవారిపై అదనముగా యీఖర్చులను వేయుటచే మరింత ఖర్చులభారము ఎక్కువగు ననుటలో సందేహము లేదు.

ఈవ్యాపారమును అభివృద్ధి జెందు దినములలో ప్రభుత్వమువా రొక ప్రత్యేకభీమాశాఖ నెలకొల్పుట ముఖ్యావసరము. కాని ఉన్నఖర్చులకు తోడు యిన్సూరెన్సుకంపెనీలవారు యీ శాఖకగు ఖర్చులనుగూడ భరించుట చాలదుస్తరము. ఈ వ్యవహారమును 'కుండలో బియ్యము కుండలోనేయుండి బిడ్డలుదుడ్డులలాగు నుండవలె' నను సామెతవలె నున్నది. ఒకే కాలములో రెండును వుండుట అసంభవమనుమాట నిజము. ఇట్టి సందర్భములలో దేశ ఆర్థిక సౌభాగ్య వృద్ధిని ప్రజాక్షేమమును కోరుప్రభుత్వమువారే యీప్రత్యేకభీమాశాఖ కగుఖర్చులను భరించి హిందూదేశములో యీ భీమావ్యాపారము సక్రమముగ నడచునట్లు చూచుట ప్రభుత్వము

వారి పిధియైయున్నది. ఇండియాప్రభుత్వము వారు త్వరలో ఒక ప్రత్యేకభీమాశాఖను నెలకొల్పి అందులకగు ఖర్చులను తామే భరించు ఏర్పాటుతో హిందూదేశ సక్రమభీమా వ్యాపారాభివృద్ధికి తోడ్పడెదరని ఆశించుచున్నాము

ii

## భారత్ ఆంధ్రశాఖ

(Bharat's Andhra Branch)

లాహోరు భారత్ యిన్సూరెన్సు కంపెనీ వారు ఆంధ్రదేశమున కంతటికిని ఒక ప్రత్యేక బ్రాంచిఆఫీసును నెలకొల్పుటకు నిశ్చయించి యీనెల 15వ తేదీనుండి రాజమహేంద్రవరములో ఒకబ్రాంచిఆఫీసు స్థాపించి పని ప్రారంభించియున్నారు. ఇదివరలో కొంత కాలము ఆంధ్రయిన్సూరెన్సుకంపెనీకిని, న్యూయిండియా అష్యూరెన్సుకంపెనీకిని ఏజంటుగా పనిచేసినట్టియు, మంచిపలుకుబడి కలిగినట్టియు, తూర్పుగోదావరిజిల్లా పిఠాపురంకాపురస్థులు శ్రీయుత ద్రోణంరాజు బాపిరాజు బి. యె; గారిని సదరు ఆంధ్రా బ్రాంచిఆఫీసునకు బ్రాంచి శెక్రటరీగా నియమించియున్నారు. సదరు బాపిరాజు గారికి పెద్దపెద్ద జమీందారులలోను, ఉద్యోగస్తులలోను, మంచిపలుకుబడి యుండుటచే వీరి యాజమాన్యమున ఆంధ్రదేశములో భారత్ కంపెనీయొక్క జీవితభీమా వ్యాపారము మిక్కిలి యభివృద్ధిజెందునని ఆశించుచున్నాము. భారత్ వారు తమ ఆంధ్రాబ్రాంచిఆఫీసునకు ఆంధ్రులనే నియమించుట కడు సంతోషము. భారత్ కంపెనీవారు తృతీయ ఆంధ్రదేశ దేశీయభీమా కంపెనీ యేజంట్ల మహాసభ వారియొక్క మూడవ తీర్మానము "ఇతరరాష్ట్రములలో నెలకొల్పబడి ఆంధ్రదేశములో సుస్థిరముగా కొంతకాలము నుండి విరివిగా వ్యాపారముచేయుచున్న భీమా కంపెనీలవారందరును తమ శాఖాకార్యస్థానములను ఆంధ్రరాష్ట్రమునకు ఓరియంటల్, ఏషియన్ నేషనల్ యిండియన్ ఇన్సూరెన్సు కంపెనీల వారు చేసినరీతిని ప్రత్యేకముగా యేర్పాటు చేసి తత్ కార్యస్థానాధిపతులుగా ఆంధ్రులనే నియోగించుట అవసరమును న్యాయమును అని ఈసభవారు తీర్మానించుచున్నారు" దాని ననుసరించి ఆంధ్రులనే తమ ఆంధ్రాబ్రాంచి ఆఫీసునకు యజమానులుగా నేర్పాటు చేసి ఆంధ్ర యేజంట్ల మహాసభ వారి తీర్మానముయెడల చూపిన గౌరవమునకు శ్రీభారత్ యిన్సూరెన్సు కంపెనీ వారిని మేమెంతయు అభినందించుచున్నాము. భారత్ యిన్సూరెన్సుకంపెనీలో పట్టాలుగల ఆంధ్రులందరును యికముందునుండి తమఉత్తర ప్రత్యుత్తరములను తెలుగున వ్రాసుకొనుటకు మిక్కిలి వీలుగ నుండుననుటకు సందేహములేదు.

III

## సర్కారు నీలిరంగు పుస్తకము

(Insurance Blue - Book) 1935

భీమావ్యాపారమున సంబంధించిన 1935 సంవత్సరము తాలూకు యిండియా ప్రభుత్వము వారి భీమా నీలిరంగు పుస్తకము గడచిన అక్టోబరు నెలలో ప్రకటింపబడినది. కాని యిది కొంత ఆలస్యముగా ప్రకటింపబడిన పుస్తకమన్నమాట నిజమే కాని దీనివలన ప్రయోజనము లేకపోలేదు. భీమావిషయములనుగూర్చి యింతకంటె విపులముగా అధికారులరీత్యా ప్రకటింపబడిన మరియొకప్రకటన ఏదియులేదు. ఇదియే హిందూదేశ భీమా ప్రపంచమున కుపమానము. గత సంవత్సరములో కంటె ఈసాలులో కొంతనూతన విషయములను గూర్చి తెలుపబడినది. ఈపుస్తకములో గల వివరములనుగూర్చి ప్రత్యేకముగా రాబోవుసంచికలో విమర్శింపబడునుగాన పాఠకులు గమనింతురుగాకయని కోరుచున్నాము.

# భీమా సమాచారములు
(Insurance News)

శ్రీయుత అశోకచటర్జీగారు, యిదివరలో పనిచేయుచున్న న్యూ ఇండియా అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్‌నకు రాజీనామానిచ్చి, భారత్ ఇన్సూరెన్సుకంపెనీ లిమిటెడుయొక్క కలకత్తా బ్రాంచిఆఫీసులో ఏజన్సీ మేనేజరుగా పనిచేయుచున్నారు.

* * *

శ్రీయుతులు: ఎస్. ఎన్. బెనర్జీ, బార్ ఎట్ లా; గోపికిషేన్ ఖెంకా, బి. ఎ., బి. యల్., ఆజంజీ హాజీదావూద్‌గార్లు, హిమాలయా అస్యూరెన్సు కంపెనీ లిమిటెడుయొక్క పాలకవర్గములో డైరెక్టర్లుగా చేరియుండిరి.

* * *

భారత్ ఇన్సూరెన్సు కంపెనీయొక్క, కలకత్తా బ్రాంచిశెక్రెటరీగారగు శ్రీయుత హరిచారణ చక్రవర్తిగారు సదరు కంపెనీతో తమకుగల సంబంధముల నన్నిటిని వదలుకొనిరని తెలియుచున్నది.

* * *

యునీక్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడు యొక్క ఆర్థికపరిస్థితిని గురించి తగుచర్య తీసికొనుటకుగాను, గవర్నమెంటు ఆఫ్ ఇండియా వారు శ్రీయుత హెచ్. ఎల్. హంఫరీస్‌గారిని ఇన్‌స్పెక్టరుగా నియమించిరి. దీనిని గురించి రాబోవుసంచికలో విపులముగా చర్చింపబడును.

* * *

ప్రావిడెంటుఇన్సూరెన్సుకంపెనీల అసోసియేషను.
శ్రీజిత్ అఖిలదత్తుగారికి విందు.

ది ప్రావిడెంటు ఇన్సూరెన్సుకంపెనీల అసోసియేషనువారు, ఇండియను లెజిస్లేటివ్ అసెంబ్లీ డిప్యూటీప్రెసిడెంటుగారగు శ్రీయుత అఖిలదత్తు యం. ఎ., బి. ఎల్., గారికి కలకత్తాలోని ఆర్యన్ అస్యూరెన్సు లిమిటెడుయొక్క ఆఫీసునందు, నవంబరు 17 వ తారీఖుసాయంత్రమున విందు నొసంగిరి.

బియాంక్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడు, తరఫున శ్రీయుత ఎ. టి. బెనర్జియాగారును, ఎసోసియేషనుయొక్క డిప్యూటీప్రెసిడెంటుగారును, అతిథులకు సుస్వాగతమొసంగిరి. శ్రీయుతులు బి. బిస్వాస్, సంపాదకులు, ఇండియన్ ఇన్సూరెన్సుజర్నల్; యం. ముఖర్జియా, సహాయ సంపాదకులు, ఇన్సూరెన్సుహెరాల్డు; బి. పి. నియోగి, సంపాదకులు, ఇండస్ట్రియల్ ఇన్సూరెన్సుజర్నల్; శచీంద్రప్రసాద్ బోసు, సంపాదకులు, బఖోసా అండ్ బానిద్యా; ఆర్. సి. దత్ ఆఫ్ పయనీర్ బ్యాంకు లిమిటెడు, మొదలుగా గల ప్రముఖులు పలువురు విచ్చేసిరి. శ్రీయుత ఎ. టి. బెనర్జీగారు, ఇన్సూరెన్సు లెజిస్లేషనును గురించి, ఆసందర్భములో ప్రస్తుతము అమలులోనున్న ప్రావిడెంటుఇన్సూరెన్సుచట్టములో జరుగబోయే మార్పులనుగురించి విపులముగా చర్చించిరి. శ్రీయుతులు ఎస్. పి. బోసు; పి. కె. ముఖర్జియాగార్లు, సదరు భీమాచట్టమునుగురించి మాట్లాడి, తమ అభిప్రాయములను వెల్లడిచేసిరి.

శ్రీయుత దత్తుగారు సదరు విషయమై కొంత వరకు చర్చించి యీవిషయము అసంబ్లీలో పెట్టి బిల్లు ప్యాసుకాకపూర్వమే ఇన్సూరెన్సులెజిస్లేషనులో దీనినిగురించి తమ శక్తిసామర్థ్యములనన్నిటిని వినియోగించి పనిచేయుదునని చెప్పియుండిరి.

* * * *

బొంబాయి లైఫ్ అష్యూరెన్సు కంపెనీ లిమిటెడు డైరెక్టరుగారగు శ్రీయుత అబ్దాలీ యం., కాజీజీ, బి. ఎ., యల్.యల్ బి., బార్ ఎట్ లా గారు మృతినొందిరని తెలుపుటకు చాల చింతిల్లుచున్నాము. వీరి ఆత్మకు భగవంతుడు శాంతి నొసంగుగాక.

* * * *

విదేశ వృత్తాంతములు

మెక్సికన్ ధనమును ఇన్సూరెన్సు కంపెనీలపై పెట్టుబడి చేయుట

కాంగ్రెసుయొక్క వార్షికోత్సవసందర్భంలో ప్రెసిడెంటు కార్డినాన్‌గారి ఉపన్యాస సారాంశములనుబట్టి చూడ మెక్సికోలో, మెక్సికన్ ధనమును ఇన్సూరెన్సుకంపెనీలపై పెట్టుబడిచేయుచున్నట్లనూ సదరుపెట్టుబళ్లు 4,205,000 పెసాస్ (పెసాస్ అనగా మెక్సికన్‌నాణెము.) ల నుండి 7450000 పెసాస్‌లకు గత సంవత్సరముకంటె యీసంవత్సరము పెరిగినదని తెలియుచున్నది.

ఇట్టి సందర్భములలో విదేశభీమాకంపెనీలకు మెక్సికోలో వ్యాపారము చేయుట దుస్సాధ్యముగ గనపడుటచే ఆనాటినుండి నేటివరకు విదేశభీమాకంపెనీల భీమావ్యాపారము క్షీణించి, మెక్సికన్‌కంపెనీలవ్యాపారము అభివృద్ధిచెందుచున్నది. ప్రస్తుతము మెక్సికోలో తొమ్మిది దేశీయకంపెనీలు మాత్రమే భీమావ్యాపారమును చేయుచున్నవి. ఈ తొమ్మిది కంపెనీలయినను కొద్దిమాత్రపు పెట్టుబళ్లతోనే వ్యాపారము చేయుచుండుటచే మెక్సికోయొక్క భీమాకొరతను తీర్చజాలకున్నవి. విదేశభీమాకంపెనీలు మెక్సికోలో తమవ్యాపారమును విరమించకముందు పెద్దపెద్ద మొత్తములకు పాలసీలను జారీచేయుచుండెడివి. మెక్సికన్ కంపెనీలకు అట్లు పెద్దపెద్ద మొత్తములకు పట్టాలను జారీచేయుటకు తగినంత శక్తి లేకుండెడిది. ప్రస్తుతము మెక్సికన్‌యొక్క ధనమును మెక్సికన్ ఇన్సూరెన్సుకంపెనీలపై పెట్టుబడి చేయుచుండుటచే వారు మంచివ్యాపారమును సంపాదింపగలుగుచుండిరి. (ఇండియన్ ఇన్సూరెన్సు)

* * *

ఇదివరలో ఆంధ్రదేశమున క్రౌన్ లైఫ్ ఇన్సూరెన్సుకంపెనీకి ఆర్గనైజరుగా పని చేయుచున్న శ్రీయుత కె. ఎన్. మూర్తిగారు, తమ పదవికి రాజీనామా నిచ్చి, శ్రీయుత చుండూరి శీతారామయ్యగారితో కలసి, బెజవాడ హెడ్‌క్వార్టర్సుగా పెట్టుకొని, గ్రేట్ ఈస్టర్న్ లైఫ్ ఇన్సూరెన్సుకంపెనీకి ఆర్గనైజరుగా పనిచేయుచున్నారని తెలియుచున్నది.

* * *

## ఓరియంటల్ వారి విరాళము

ఈమధ్య గుంటూరుజిల్లాలో తుపాను వలన సంభవించిన కష్టనివారణ సహాయనిధికి ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అష్యూరెన్సు కంపెనీలిమిటెడు వారు ఒక వెయ్యిరూపాయల విరాళము నిచ్చియుండిరి. ఆ ప్రదేశములో తమకంపెనీయొక్క పట్టాదారులకు కొంత కన్సెషన్ గూడ చూపిరి. ఇట్టి కార్యము చాల ప్రశంసనీయము. బీద సాధులయెడ ఈ కంపెనీవారు చూపిన ఈ ఔదార్యము మెచ్చుకొనదగినదే!

(భీమాపత్రికా సంపాదకుడు)

# జీవితభీమాపరీక్షలు

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు.)

ఇదివరలో లండనులో జరుపబడే ఛార్టర్డు ఇన్సూరెన్సు ఇన్‌స్టిట్యూటువారి పరీక్షల సంగతిన్ని (A. C. I I.)ఇన్సూరెన్సు ఇన్‌స్టిట్యూటు ఆఫ్ అమెరికా, న్యూయార్కు పరీక్షల సంగతిని గూర్చి నవంబరు 1935, డిశంబరు 1935, 1936 మే, 1936 జులై సంచికలలో (A. C. I. I.) పరీక్షాపత్రముల వివరాలున్నూ, 1936 ఆగస్టు సంచికలో అమెరికాపరీక్షల-సంగతి వ్రాసితిరి. కాని యీ ఆగస్టు సంచికలో ప్రచురించిన పరీక్షాపత్రాలకే (C L.U) డిగ్రీ యిస్తారని వ్రాసితిమి. అది పొరబాటు. ఆ పరీక్షలకు ఇన్సూరెన్సు ఇన్‌స్టిట్యూటు ఆఫ్ అమెరికా, న్యూయార్కు అనే పేరు. ఆరెండున్నూగాక యిపుడు (C.L.U.) ఛార్టర్డు లైఫ్ అండర్ రైటర్ అను పరీక్షలసంగతి యీదిగువ వివరించితిని. ఈ కాలేజీ ఫిల్‌డెల్ఫియాలో నున్నది. ఈ కాలేజీవారు యీ భీమాశాస్త్రముతో వయోజన విద్యకై తగు ఏర్పాట్లు జేసిరి. ఈ పరీక్షలను అమెరికాలోనున్న ప్రతి యూనివర్‌సిటీలోను నేర్పుటకు తగు ఏర్పాట్లనుచేసిరి. యూనివర్సిటీ విద్యతో బాటు యీ పరీక్షలకుకూడ చదివి రెంటిలోను ఒకేసారి డిగ్రీలను పొందుఏర్పాటుజేసిరి. ఇట్టి యేర్పాట్లు మనదేశపు విద్యావిధానములో యింతవరకు లేవు. కలుగజేయవలెనను ఆందోళన జేస్తున్నాము. ఎప్పటికి ఫలించునో తెలియదుగదా!

# సి. యల్. యు. పరీక్షలు

ఫిల్‌డెల్ఫియా (అమెరికా సంయుక్తరాష్ట్రాలు)

అమెరికన్ కాలేజి ఆఫ్ లైఫ్ అండర్ రైటర్సు అనుపేరట యీపరీక్షలకు ఫిల్‌డిల్ఫియాలో పాఠశాల కలదు.

ఈపరీక్షలలో యీదిగువ భాగములున్నవి.

మొదటి భాగము

జీవితభీమా ముఖ్యసూత్రములు.

ఇందు (ఏ), (బి), అనుభాగములున్నవి.

(ఏ) జీవిత భీమాయొక్క అర్ధశాస్త్రము

(బి) జీవితభీమాసిద్ధాంతములు వాటిని అమలుపరచు విధానము.

రెండవ భాగము

జీవితభీమాను అమ్మువిధానము.

(ఏ) అమ్మువిధానములోవుండేసిద్ధాంతములు

(బి) జీవిత భీమాను అమ్ముటలో నుండే ఆత్మతత్వజ్ఞాన శాస్త్రము.

మూడవ భాగము

సాధారణంగా వుండవలసిన విజ్ఞానము.

(ఏ) అర్ధశాస్త్రముపాఠములు

(బి) గవర్నమెంటు

(సి) సాంఘికశాస్త్రము

నాల్గవ భాగము

న్యాయశాస్త్రము ట్రిస్టు, పన్నులు

(ఎ) వాణిజ్య చట్టము

(బి) విల్సు, ట్రిస్టు, ఎస్టేట్సు

(సి) పన్నులు

అయిదవ భాగము

ధనము

(ఎ) కూడికధనము

(బి) బ్యాంకింగు- పరపతి

(సి) పెట్టుబళ్లు

ఈఅయిదుభాగములకు కలిపి ఒకేసారిగాని ఏభాగానికి ఆభాగంగాగాని చదివి పరీక్షకు వెళ్ల వచ్చును. ఈభాగములో ప్రతిభాగమునకు ఏయే పుస్తకాలు చదువవలెను అను వివరములు తెలుపబడును. ఏయే పుస్తకాలు చదువవలెనో ఆ వివరాలు అమెరికా సంయుక్త రాష్ట్రములలోని పరీక్షలను తప్ప లండనులోని పరీక్షలకు ఆదేశము వారు పుస్తకాల జాబితాను యిచ్చారు. ఈపరీక్షలు ప్రతిసంవత్సరం జూన్ నెలలో జరుగును. ఈపరీక్షలను చదువు ఏర్పాట్లు ఇండియాలో యింతవరకు లేవు. చదువువారున్న ఏర్పాట్లు చేస్తామని ఆంధ్రకాలేజి ఆఫ్ కామర్సు రాజమండ్రివారికి వ్రాసిరి. పరీక్షాపత్రములను తర్జుమాచేసి ముందుసంచికలో ప్రచురణకాబడును.

# ఇండియన్ ఇన్స్యూరెన్సు ఇయర్ బుక్
# 1935

గవర్న మెంటు ఆఫ్ ఇండియా, ఆక్చ్యురీఅగు శ్రీయుత యస్. ముఖర్జీగారిచే తయారుచేయబడిన 1935 సం॥రపు ఇండియన్ ఇన్సూరెన్సు ఇయర్ బుక్, కొంత ఆలస్యముగా వచ్చినప్పటికిన్నీ, దానిని మనము అభినందనముతో అంగీకరించవలసి వుంటుంది. ఈ పుస్తకమునందు 1934 సం॥లో హిందూదేశములో పనిచేసిన భీమా కంపెనీలయొక్క అంకణాజాబితాలు తెలుపు అంకెలు గలవు. హిందూదేశంలో భీమా వ్యాపారమును చేయుచున్న కంపెనీల మొత్తము సంఖ్య 366. వీటిలో 217 కంపెనీలు దేశీయకంపెనీలు. 149 కంపెనీలు విదేశ కంపెనీలు గలవు. ఈ 149 విదేశకంపెనీలలో 69 కంపెనీలు యునైటెడ్ కింగ్ డం వారివి, 30 కంపెనీలు బ్రిటిషు డొమినియన్సు కాలనీలవారివి, 20 కంపెనీలు యూరపు వారివి, 16 కంపెనీలు అమెరికావారివి, 9 జపానువారివి, 5 జావనీసువారివి. నూతనముగా ఆ సంవత్సరములో 26 హిందూదేశపు ప్రాణభీమా కంపెనీలు స్థాపింపబడి వ్యాపారమును చేయుచున్నవి.

1934 సం॥లో రు 38 కోట్ల విలువగల 215,000 క్రొత్తజీవిత భీమాపట్టాలను జారీ చేసియుండిరి. ఈ మొత్తములో, రు 28 కోట్ల విలువగల 183,000 పట్టాలు హిందూదేశపు కంపెనీలవారివి. బ్రిటిష్ కంపెనీలవారివి రు 4కోట్లు, డొమినియను అండ్ కలోనియల్ కంపెనీలవి రు 5½ కోట్లు, ఒక జర్మన్ భీమాకంపెనీవి రు 50 లక్షలు.

1934 సం॥లో దేశీయ కంపెనీలచే జారీచేయ పడిన క్రొత్తపట్టాల విలువ మొత్తము సగటున రు 1528 లు. విదేశభీమాకంపెనీలచే జారీచేయబడిన నూతనపట్టాల విలువ మొత్తము సగటున రు 3,213. గతసంవత్సరము దేశీయకంపెనీలచే జారీచేయబడిన పట్టాల విలువ మొత్తము సగటున రు 1,555 లు, విదేశకంపెనీలచే జారీచేయబడిన పట్టాలవిలువ మొత్తము రు 3,126 లు. దీనినిబట్టి చూడ దేశీయకంపెనీలు జారీచేసిన పట్టాలవిలువ మొత్తము కొంచెము తగ్గినదనిన్ని, విదేశకంపెనీలు జారీచేసిన పట్టావిలువ మొత్తము హెచ్చినదని తేలుచున్నది. బ్రిటిష్ కంపెనీల క్రొత్త వ్యాపారములో రు 50 లక్షలు ఎక్కువగను, డొమినియన్ అండ్ కలోనియల్ కంపెనీల వ్యాపారములో రు 50 లక్షలు ఎక్కువగను, వున్నది. 1934 సం॥ ఆఖరునకు రు 215 కోట్ల విలువగల 987,000ల దేశీయకంపెనీల జీవితభీమా పట్టాలు అమలులో నున్నవి. రు 132 కోట్లు విలువగల రు742,000పట్టాలుహిందూ దేశపుజీవిత భీమాకంపెలవారివి. మిగిలినవి విదేశభీమా కంపెనీలవి. ఇయర్ బుక్కులో ఉదహరింపబడిన రీతిని హిందూదేశపు జీవితభీమాకంపెనీలు ప్రతి సంవత్సరము రు 2,75,000ల ఏన్యుయిటీ వ్యాపారము చేయుచున్నప్పటికి అదిచాలకొద్దిమాత్రపు వ్యాపారమని తేలుచున్నది. 1934సం॥ ఆఖరునకు మొత్తము అమలులో నున్నఏన్యుయిటి వ్యాపారముువిలువ రు6 50,000. దీనిలో ఒక లక్షరూపాయలు మాత్రమే హిందూదేశపు జీవిత భీమా కంపెనీలవారివి.

పోస్టుఆఫీసు అస్యూరెన్సు ఫండునకు రు 17, 88,66,000లు విలువగల89, 522 పాలసీలుగలవు.

జనరల్ ఇన్సూరెన్సు.

1934 సం॥ లో ప్రాంభీమాకాక తదితరజనరల్ ఇన్సూరెన్సు వ్యాపారపు ప్రీమియములమీద రాబడి మొత్తము రు 2,47,00,000 లు ఈవ్యాపారములో హిందూదేశపు కంపెనీలవారి వ్యాపారము విలువ రు 54 లక్షలు. విదేశ కంపెనీలవారివ్యాపారమువిలువ రు 193 లక్షలు. ఇక్కడ మనము గమనించవలసిన విషయము వొకటి గలదు. 1933 సం॥ లో అన్ని కంపెనీలకు కలిపి ప్రీమియములమీద రాబడి రు 2,50,00,000 లు. దీనిలో దేశీయకంపెనీలవారివి రు 71 లక్షలు. విదేశీయులవారివి రు 179 లక్షలు. దీనినిబట్టి చూడ హిందూదేశపు భీమా వ్యాపారముమీద రాబడి ఆనాటికానాడు క్షీణించి, విదేశ కంపెనీల భీమావ్యాపారముమీద రాబడి యెక్కువగుచున్నదని తెలియగలదు. గనుక హిందూదేశపు భీమాకంపెనీలు మంచిదశకు వచ్చుచున్న వనుకొనుట ఒక వెఱ్ఱిభ్రమ తప్ప మరియొకటికాదు. దేశీయకంపెనీల పెట్టుబళ్లు విలువ మొత్తము రు40 కోట్లు.

గవర్నమెంటు ఆఫ్ ఏక్చ్యుయరీగారి రిపోర్టును బట్టి చూడ, హిందూదేశపు భీమా వ్యాపారము మంచిదశలో లేదని తేలుచున్నది. గత నాలుగు సంవత్సరములనుండి జనరల్ ఇన్సూరెన్సు వ్యాపారముమీద ప్రతి సంవత్సరము రు 2½ కోట్లు విలువగల వ్యాపారము వచ్చుచున్నప్పటికి, విదేశ కంపెనీల వ్యాపారముతో దేశీయ భీమా వ్యాపారమును పోల్చిచూచిన, దేశీయ భీమా వ్యాపారము ఎంత దీనస్థితియందున్నది తెలియగలదు. 1933 సం॥లో బ్రిటిష్ కంపెనీల రాబడి రు 119,95,000 లు. 1934 సం॥లో రు 1,28,46,920 లు. కలోనియల్ కంపెనీలలో గూడ అభివృద్ధిగలదు. వీరి రాబడి 1933 సం॥లో 38,12,030 లు. 1934 సం॥లో రు40,86,000 లు. అమెరికావారి వ్యాపారముగూడ బాగుగ నున్నది.

1933 సం॥లో వీరి ప్రీమియముల మీద రాబడి రు 11,70,000 లు. 1934 సం॥లో రు 12,69,000 లు. కాంటినెంటల్ కంపెనీలవారి ప్రీమియముల మీద రాబడి 1933 సం॥లో 7,06,000 లును, 1934 సం॥లో రు 9,11,000 లును గలదు.

హిందూదేశపు భీమాకంపెనీలకు 1933 సం॥ లో కన్న 1934 సం॥లో ప్రీమియముల మీద రాబడి తగ్గినది. దీనిని బట్టి చూడ హిందూదేశపుభీమావ్యాపారమును మంచి ఉన్నతదశకు తీసుకురావలసిన ఆవశ్యకతను గూర్చి తీవ్రముగా ఆలోచించవలసిన ఆవశ్యకత గలదు. హిందూదేశమునందు దేశీయవిదేశీయ కంపెనీల వ్యాపారమునందు పోటీ యెక్కువగుటచే యింతవరకు ఏ కొద్దిమాత్రపు వ్యాపారమును చేయుచున్న హిందూదేశపుకంపెనీల వ్యాపారము తర్వాలో అంతరించిపోవును. గనుక ఢిల్లీయందు సమావేశమైన ఇన్సూరెన్సుకమిటీవారు, హిందూదేశపు భీమా వ్యాపారమునకు చేయూతనొసంగి పైకి లేవతీయుటకు తగు సౌకర్యములను బిల్లునందు ప్రవేశపెట్టెద రని ఆశించుచున్నాము.

(ఎస్. జగన్నాథస్వామి)

# భీమాకంపెనీలు - గవర్నమెంటు డిపాజిట్టు

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు)

భీమాకంపెనీలు 25 వేల రూపాయలను గవర్నమెంటు కరెన్సీ కంట్రోలరువద్ద జమకట్ట వలెను. అటుపిమ్మట ప్రతిఏటా భీమాకంపెనీలకు వచ్చే ప్రీమియముసొమ్ములో 1/3 వంతు సొమ్మును ఒకలక్ష పూర్తిఅగువరకు జమకట్ట వలెను. అటుపిమ్మట భీమాకంపెనీలవారు తేల్చే లెక్కలలో జీవితభీమాసొమ్ముకు 1/3 చేర్చుతూ వుండవలెను. ఈజీవితభీమా సొమ్ము పాలసీదార్లకు ప్రాణాధారమని తెలుసుకోవలెను. ఈఏర్పాట్లలో ఏఒక్కదానిని కంపెనీ నిర్వర్తించలేకపోయినను గవర్నమెంటువారు కంపెనీవారికి నోటీసుమాత్రం 'కారణాలు తెలుప'మని ఇస్తారు. అంతేకాని అంతకు మించినపని ఏదిగు చేసినట్లగపడదు. కంపెనీవారు యిచ్చే సముజాయిషీనిబట్టి ఊరుకోవచ్చును. లేదా కంపెనీని మూసివేసే స్థితిలోనికి తేవచ్చును. అంతేగాని అట్టిస్థితి ఎప్పుడయితే వచ్చిందో అప్పుడే గవర్నమెంటువారు తమఆఫ్ఫ్యాయుకీకఆవిషయందెలిపి ఆకంపెనీని మరోకంపెనీలోనికి కలిపేయత్నం చేయడం మంచిది. అలా చేయనిచో పాలసీహోల్డర్సుకు చాలా కష్టంకలుగును. ఈమధ్యను బెంగాలులో ఒక భీమా కంపెనీని మూసివేసిరి. దానిని బట్టి పట్టాదార్లు యెంతనష్టపడి యుందురో యోచింపుడు! భీమాచట్టంలో మరో భీమా కంపెనీలో కలుపవచ్చునసే రూలు వుంది కాని అటుల కలుపుటకు ప్రభుత్వము వారు సలహానిచ్చిన విషయాలేవియు యింతవరకు కానరావు. రాబోవు భీమాసవరణచట్టములో యీవిషయమై తగిన కట్టుదిట్టమునకుగాను పట్టాదార్లు ఏజంట్లు తగిన కృషి చేయవలసివుంది.

# సవరణలు

కలకత్తాలోని హిందూస్థాన్ కో - ఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటీ లిమిటెడువారు యావజ్జీవిత భీమాపై సం॥ 1కి రు1000 లకి రు. 20/- చొ॥ననూ, ఎండోమెంటుభీమాలపై సం॥ 1కి రు1000 లకు రు 23/- చొ॥ననూ బోనను యిచ్చుచున్నారు. గతసంచికలో అనగా నవంబరు సంచికలో ఎండోమెంటుభీమాలపై సం॥ 1కి రు 1000/- లకు రు 23/- ల బోనసునకు బదులు సం॥ 1కి రు 1000లకు రు 20/- ల బోనను అని పొరపాటున ముద్రింపబడినది. చదువరులు ఎండోమెంటు పట్టాలపై సం॥1కి రు 1000 లకు రు23/- లని చదువుదురుగాక.

శ్రీయుత జి. యస్. మరాతేగారు తమ విరాళమును 1935 సం॥లో బెజవాడ నగరమునందు వారి ఆధిపత్యమున జరిగిన కాన్ఫరెన్సు సందర్భమున వచ్చిన డెఫిసిటు పూర్తిచేయుటకుగాను పంపియుండిరి. అది 1936సం॥ కాన్ఫరెన్సు డెఫిసిటు అని పొరబాటున ముద్రింపబడినది. చదువరులు ఈమార్పును గమనింతురుగాక.

(భీ॥ ప॥ సంపాదకుడు)

# ద్వితీయ ఆంధ్రదేశ దేశీయభీమాపట్టాదార్ల మహాసభ, గుంటూరు – 1936

1936 సం॥ అక్టోబరు 4వ తేదిని మధ్యాహ్నం మూడుగంటలకు గుంటూరులో ఏషియన్ అస్యూరెన్సుకంపెనీవారి బ్రాంచిఆఫీసు ఆవరణలో శ్రీయుత వేమవరపు రామదాసుపంతులు గారి అధ్యక్షతక్రింద, ఆంధ్రదేశ భీమాపట్టాదార్ల మహాసభ సమావేశమై గావించిన తీర్మానములు:—

(1) 1935 సం॥ రం ఆగస్టు 18 వ తేదీని బెజవాడలో జరిగిన ప్రథమ మహాసభవారు చేసిన 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11, 12, 13, 14, 15, 16, 17 తీర్మానములను తిరిగి ఆమోదించుచు తీర్మానించడమైనది.

ఉ॥ సూరంపూడి కనకరాజుగారు.

ఆ॥ శనివారపు సుబ్బారావుగారు.

(2) ఈసంఘోద్దేశమును నెరవేర్చుటకు కావలసిన పనులనన్నిటను చేయుటకు యీ తేదీలగాయతు 1937 సం॥ డిశంబరు ఆఖరువరకు కార్యనిర్వాహక సంఘముగాను, ఉద్యోగులుగాను, ఎన్నుకొనడమైనది.

1. శ్రీయుతులు శ్రీ దేశరాజు హనుమంతరావు పంతులుగారు ప్రెశిడెంటు
2. ,, జంధ్యాల దక్షిణామూర్తిగారు
3. ,, చాగంటి సూర్యనారాయణమూర్తిగారు
4. ,, నోరి రామశాస్త్రిగారు
5. ,, నరశింహదేవర సత్యనారాయణగారు
6. ,, వి. వి. సి. సుబ్రహ్మణ్యంగారు
7. ,, శనివారపు సుబ్బారావుగారు
8. ,, సూరంపూడి కనకరాజుగారు
9. ,, మల్లెల శ్రీరామమూర్తిగారు-శెక్రటరీ
10. ,, వెణుతురుమిల్లి శ్రీరామారావుగారు జాయింటు సెక్రిటరీ
11. భోగరాజు వెంకటరత్నంగారు.

ఉ॥ డి. శాంతయ్యగారు

ఆ॥ ఇవటూరి వీరభద్రయ్యగారు

(3) పాలసీహోల్డర్సుతరఫున డైరెక్టర్ల స్థానమునకు ఎన్నుకొను సందర్భములో పట్టాదార్లందరికి సమానమైనవోటుహక్కును ఉండుటకునూ ఆవోటుహక్కును తపాలాద్వారా (exercise) జేయుటకు అధికారముండునట్లు అవకాశము గలుగజేయవలెనని, కంపెనీలవా రమలులోనికి తేవలెనని యీసభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ శనివారపు సుబ్బారావుగారు.

ఆ॥ కొడాలి ఆంజనేయులుగారు.

(4) రాబోవు ఇన్సూరెన్సు చట్టసవరణలో పాలసీహోల్డర్సు హక్కులను కాపాడుటకుగాను యీ సమావేశమువారు శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారిని ప్రతినిధిగా ఎన్నుకొనుటకునూ, వీరి నేగవర్నమెంటువారు నియమించు (expert )కమిటీలో సభ్యులుగా నియమింపవలసినదిగా ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు.

ఉ॥ శనివారపు సుబ్బారావుగారు.

ఆ॥ సూరంపూడి కనకరాజుగారు.

(5) యిన్సూరెన్సు కంపెనీల యాక్టు సవరణ చేయుటలో షేరుహోల్డర్ల పెట్టుబడిమీదనూటికి సాలుకు రు 12 లకు మించి డివిడెండుయివ్వకూడదనిశాసించవలెనని ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు,

(సం॥) వేమవరపు రామదాసు.

4—10—1936. ప్రెశిడెంటు,

# సహకారపరపతిసంఘములు

గవర్నమెంటు వ్యవసాయశాఖవారు ఇచ్చునటువంటి సలహా సహాయములకు తోడు సహకారశాఖవారు సహకారపరపతిసంఘముల ద్వారా రయితులకు వ్యవసాయముచేయు నిమిత్తము పరపతిని కలిగించుచున్నారు. సహకార పరపతి సంఘములు లాభకరమైన పద్ధతులమీద ఋణముల నిచ్చుటయేకాకుండా వడ్డివ్యాపారములు క్రమమైన పద్ధతులమీద జరుగుచున్నట్లు చేయును. సదరు శాఖవారు వ్యవసాయదారులకు పైరు అమ్ముటలోను పరికరములు కొనుటలోను పరపతిని అభివృద్ధిచేయుచున్నారు. ఈవిధమైన సంఘములు పైనిచెప్పిన ప్రకారము పరపతిని వృద్ధిజేయుటయేగాక రయితులకు యితర అభివృద్ధికరములగు పనులలో ప్రోత్సాహించుచున్నవి. కొన్ని సంఘములు కొన్ని ప్రదేశములలో నవీన శాస్త్రీయ పద్ధతులమీద వ్యవసాయముచేసి అట్లు చేయుటవలన గలుగు లాభములను నిదర్శనపూర్వకముగా చూపుచున్నవి. కొన్ని సంఘములు విత్తనములు ఎరువులు వ్యవసాయపుపనిముట్లు రయితులకు యిచ్చుట పూర్వకముగా సహాయము చేయుచున్నవి. గ్రామ పరపతి సంఘములకు అప్పు యిచ్చు నిమిత్తము కృష్ణాజిల్లాలో రెండు సెంట్రల్ బ్యాంకులు వున్నవి. 22,176 మెంబర్లుగల 382 వ్యవసాయ పరపతిసంఘములు యీజిల్లాలో నున్నవి. ఈ సంఘములన్నియు కలిసి రూ 20,05,641 లు వ్యాపారమును చేయుచున్నవి. ఋణముల సందర్భములో రూ 14,72,679 లు సదరు సంఘములు యివ్వవలెను. ఆర్థికదుస్థితికాలములో రయితులకు సహాయము చేయునిమిత్తము అనేక సాధనములు చేయబడినవి. 9⅜ పర్సెంటునుంచి 7½% కు వడ్డీరేటు తగ్గించబడినది. శిక్షార్థపు వడ్డీరేటు అగు 12½% తీసివేయబడినది. ఎన్నుకొనబడిన ప్రదేశములలో సంఘముల సమూహపు మీటింగులు ఏర్పాటు చేయబడుచున్నవి. సదరు మీటింగులలో పరపతిశాఖఅధికార్లు సంఘములను స్వయముగా తరుచుగా తనిఖీ చేయుటయేగాక హాజరై సదరు సంఘముల మెంబర్లుతో సంఘముల అభివృద్ధివిషయమై తగుఏర్పాటులుచేయు విషయములలో ఆలోచించెదరు. సెంట్రల్ బ్యాంకు తన సూపరువైజర్లద్వారా అవసరమైన మెంబర్లకు సకాలములో ఋణములు యిచ్చుట పూర్వకముగా సహాయము చేయుచుండును. సవరించుట సమకూర్చుట అనే పద్ధతిమీద, సంఘములు సరియైన దారిలో వుంచబడినవి. సర్కారువారు, రాజధానిలో నాన్‌క్రెడిట్ సంఘముల అజమాయిషీ నిమిత్తమున్ను, ఋణముల అమ్మకపు సంఘములు అభివృద్ధిచేయు నిమిత్తమున్ను ఇన్‌స్పెక్టర్లను వేయుచున్నారు. మరియు, ఋణములు అమ్మకపు సంఘములు సరియైనధర వచ్చువరకు ధాన్యమును నిలువచేయు నిమిత్తము కొట్లుకట్టుటకు ఋణములను సర్కారువారు యిచ్చుచున్నారు. అయితే యీ ఋణములు సరియైన అమలులో లేవు. దక్షిణ ఆర్కాటు జిల్లాలోని వేరుశనగ అప్పు విక్రియసంఘము ముఖ్యమైన ప్రదేశములలో కొట్లను అద్దెకు తీసుకొని లాభకరమైన పనిని చేయుచున్నది. ఈ బాపతుసంఘముల యొక్క వుద్దేశ్యము వ్యవసాయదారుదగ్గిరనుంచి పైరును తీసుకొని సదరు పైరుకు క్రయదారుని కనుగొనటము అయివున్నది. సంఘము పైరు ఖామందుకు సరియైన తూనికప్రకారము ఖరీదు యివ్వటము వుండును. ఈప్రకారము చేయడము తూనికలో పైరుఖామందుకు మోసమువుండదు.

ముందు ఎక్కువ ధర రాగలదనే వుద్దేశ్యముతో రయితు పయిరును నిల్వచేయుదలచుకొనినయెడల సదరు సంఘపుగొట్లు అధికారి, గొట్లలో పైరును నిల్వచేయనిచ్చును. అవుసరమున్నయెడల సదరు పైరు హామీామీద అమ్మకపు సంఘములో నుంచి అప్పును రయితుకు సదరు అధికారి యిప్పించును. ఈవిధమైన అమ్మకపు ఋణపుసంఘములు కృష్ణాజిల్లాలో బందరు, బెజవాడ, నందిగామలో వున్నవి. ఈ మూడు సంఘములు 136 ప్రత్యేకపు మెంబర్లను 33 సంఘములు మెంబర్లను గలిగి రూ 4,614 లు మూలధనముతో వున్నవి. పైర్లను తనఖావుంచి మెంబర్లకు ఋణములను యిచ్చిన బాపతు రూ 1,22,765 లు రావలసి వున్నవి. ఈ సంఘములు ఒక నాన్ క్రిడిట్ సీనియరు యిన్‌స్పెక్టరు అజమాయిషీలోవున్నవి. వ్యవసాయదారుల సౌకర్యముల నిమిత్తము రెండు చెరుకును పెంచు సంఘములు, రెండు పరిశ్రమల సంఘములుగూడ యీ జిల్లాలో వున్నవి. నేతగాండ్ర సంఘములకు కొన్నిటికి, సరకు నిలువజేయు నిమిత్తము సిబ్బందిని వేసుకొనుటకు కావలసిన ధనమును సర్కారువారు యిచ్చుచున్నారు. ప్రస్తుతము కృష్ణాజిల్లాలో పెడన, అంగలూరు, పెద తుమ్మిడి గ్రామములలో రూ 555 లు మూలధనముతో మూడు నేతగాంద్రసంఘములు పనిచేయుచున్నవి. చెన్నరాజధానిలో చేతితో నేసిన వస్త్రముల అమ్మకము అభివృద్ధినిమిత్తమున్ను, వర్తకపుపద్ధతిని చేతినేతపరిశ్రమను ఏర్పాటుచేయుటకును "మద్రాసుచేతినేత పనివాండ్ర రాజధాని సహకార సంఘము"ను ఏర్పాటుచేసినారు. ఇండియా గవర్నమెంటువారు యీ రాజధానికి 1934-35 వ సం॥కు రూ 26,500 లు, 1935-36 వ సం॥కు రూ. 59,500 లు చేతినేతపరిశ్రమ పరిగా ఏర్పాటు చేసి అభివృద్ధిచేయు నిమిత్తము యిచ్చివున్నారు. ఈ బాపతుసొమ్ము సదరు సంఘము అభివృద్ధికి వుపయోగింపబడుచుండును.

నిమ్నజాతుల సంఘములు:—పరపతిసంఘముల యేర్పాటుద్వారా నిమ్నజాతుల అభివృద్ధికి సహాయము చేయబడుచున్నది. ప్రస్తుతము 85 నిమ్నజాతిపరపతిసంఘములు గలవు. సదరు సంఘములు సలుగురు సహకారశాఖ ఇన్‌స్పెక్టర్లు అజమాయిషీక్రింద ఇన్‌స్పెక్టరుకు 25 సంఘములుచొప్పున వున్నవి. 85 సంఘములలోను, 44 "ఫీల్డు లేబరు సంఘములు" గలవు. ఈ ఫీల్డులేబరుసంఘములు సర్కారు వద్దనుంచి భూములు గుత్తకు తీసుకొని జాయింటుగా వ్యవసాయము చేయించును. 1935 వ సంవత్సరం జూలై నెల 30 వ తేదికి సదరు సంఘములు సాగుచేసిన మొత్తము విస్తీర్ణము 1,671 యకరములు. ఈ సంఘములు శిస్తు యిచ్చుటకు పరపతివ్యాపారముగూడ చేయును. 1935 వ సంవత్సరము జూన్ నెల 30 వ తేదికి మెంబర్ల వద్దనుంచి రావలసిన మొత్తము బాకీ రూ 5,723 లు అయివున్నది. 34 పరపతిసంఘములు నిమ్నజాతులపరపతిఅభివృద్ధినిమిత్తము ప్రత్యేకముగావున్నవి. కైకలూరు తాలూకాలో 7 అగ్నికుల క్షత్రియుల సంఘములు వున్నవి. ఈ సంఘములు చేపలుపట్టు నిమిత్తము జడలు, గుణ్ణములను గుత్తకు తీసుకొనుచున్నవి. పరపతి అవుసరమువిషయములో చేయు సహాయమే గాక నిల్వచేయు అవుసరము విషయములో నిమ్నజాతులకు సరియైన శిక్షణ విధింపబడుచున్నది. హుండీపెట్టెలు ప్రవేశపెట్టుటమూలముగా వారు చేయు కొద్దినిల్వ అవసరమైనప్పుడు ఎట్లు వుపయోగించుకొనుటకు వీలుండునో తెలియ చెప్పుచున్నారు. ఇప్పటివరకు 858 హుండీ

పెట్టెలు 44 సంఘములలో ఏర్పాటు చేయడమైనది.

భూమితనఖాబ్యాంకులు:— ఈ రాజధానిలో సహకార అభివృద్ధిసందర్భములో గమనించవలసిన వాంశము యేమనగా యిటీవల భూమితనఖా బ్యాంకులద్వారా దీర్ఘవాయిదాలమీద అప్పుపుచ్చుకొనుటకు అవకాశము కలుగచేయుట భూమితనఖామీద అప్పుయిచ్చు పద్ధతిని 1925 వ సంవత్సరములో స్థాపించబడినది. అప్పుడు గవర్నమెంటువారు రాజధానిలో పరీక్షార్థము నాల్గు ప్రదేశములలో సహకార పద్ధతిమీద భూమితనఖాబ్యాంకులు యేర్పాటు చేయుటకు వొప్పుకున్నారు. ఈ బ్యాంకులయొక్క ముఖ్యవుద్దేశము రయితులు తమ స్వంత పొలముల సేవ్యము నిమిత్తము భూముల తనఖామీదగాని అన్యథాగాని లోగడచేసిన అప్పులను తీర్చుకొను నిమిత్తము బ్యాంకులలో దీర్ఘవాయిదాలమీద అప్పులు యివ్వటము అయివున్నది. భూమి మరమ్మతు వ్యవసాయపద్ధతులు కూడ సదరు బ్యాంకులు గమనించును. ఈబ్యాంకులు మూలధనము వాటాలమూలమునను డిపాజిట్ల మూలమునను డిబెంచర్ల మూలమునను కావలసినధనమును స్వీకరించవలసివున్నవి. ఈ బ్యాంకులు యేర్పాటు చేసిన రెండు సంవత్సరముల తర్వాత గమనించబడినకష్టము యేమనగా, డిబెంచర్లు తగుమామీ వున్నను అమ్ముడుబడుట దుర్లభము అయినది. అందుచేత 1929వ సంవత్సరము అక్టోబరునెలలో గవర్నమెంటువారు ఒక సెంట్రల్ భూమితనఖా బ్యాంకును ఏర్పరచినారు. గ్రామ సంఘముల వలన ట్రాన్సుఫరుకాబడిన ఆస్తులమీద డిబెంచర్లు యిస్తూ సదరు డిబెంచర్లు అమ్మకపు పైకంలోనుంచి బ్యాంకులకు కావలసిన పైకములను సదరు సెంట్రల్ బ్యాంకు యిచ్చును. స్కీము ప్రకారము సెంట్రలు బ్యాంకు తనకు తనఖా వుంచిన (ట్రాన్సుఫరుకాబడిన ఆస్తుల విలువకు 50% వరకు డిబెంచర్లు యిచ్చును. ప్రస్తుతము సహకార సంఘములు రిజిష్ట్రారుగారు సదరు బ్యాంకుకు ఒక ట్రస్టీగా నియమింపబడినారు. డిబెంచర్లు తీసుకొనువారికి డిబెంచర్లు నిబంధనలును బ్యాంకు సరిగా గమనించునట్లు వారు జూచెదరు. భూమితనఖా పరపతిస్కీము సరిగా పనిచేయు నిమిత్తము సర్కారువారు అనేకవిధముల మొదటినుంచి సదరు బ్యాంకుకు సహాయము చేయుచున్నారు. సర్కారువారు స్వంత ఖర్చుమీద అర్జీదారులు తనఖావుంచబోయే భూములు తనిఖీచేసి విలువ నిర్ణయించు నిమిత్తము కొంత సిబ్బందిని యేర్పాటుచేసినారు. ప్రతిసంవత్సరము భూమితనఖా బ్యాంకులు నిదానముగా పెరుగుచున్నవి. ప్రస్తుతము రాజధానిలో 79 ప్రైమరీ బ్యాంకులు వున్నవి. కృష్ణాజిల్లాలో గుడ్లవల్లేరు పెడన (వడ్లమన్నాడు భూమితనఖా బ్యాంకు) కయికలూరు, వుయ్యూరు, గన్నవరం, దివిలో మొత్తం ఆరు బ్యాంకులు వ్యవసాయదారుల అవుసరములు పూర్తిచేయు నిమిత్తము పనిచేయుచున్నవి. సదరు బ్యాంకుల మెంబర్లవలన రావలసిన మొత్తము పైకము రూ 7,49,421 లు. సెంట్రల్ భూమితనఖా బ్యాంకుకు యిప్పుడు స్థాయి చిక్కినదని చెప్పవచ్చును. సదరు బ్యాంకువారు యిచ్చిన డిబెంచర్లుతాలూకు అసలుకున్ను వడ్డికిన్ని సర్కారువారు పూచీయిచ్చుటచేత డిబెంచర్లు జనులకు అనుకూలముగా వున్నవి. ఇండియాట్రస్టుఆక్టుకు యిటీవల రాబడిన సవరణప్రకారము యీ డిబెంచర్లు ట్రస్టీ హామీగా సమోదుచేయబడినవి. భూమితనఖా బ్యాంకులు రిజిస్ట్రేషనుఫీజు కట్టవలసిన అవసరముగూడా లేదు.

ఈ దిగువ నమోదుచేసినవి సర్కారువారి వలన సహకార సంఘములకు యివ్వబడిన సౌకర్యములలో కొన్ని అయివున్నవి:—

1. సహకార పరపతిసంఘములు సివిల్‌కోర్టుతో నిమిత్తము లేకుండా మధ్యవర్తి మూలముగా తమ వ్యవహారములను పరిష్కరించుకొనవచ్చును. మధ్యవర్తుల యవార్డులు తీర్పులు అమలు జరుపు నిమిత్తము కొంత సిబ్బంది ప్రత్యేకముగా నియమింపబడినది.

2. (1) మెంబర్లకు వచ్చు సహకార పరపతి సంఘముల తాలూకు లాభములమీద డివిడెండ్లుమీద ఆదాయపుపన్ను విధింపబడదు. (2) సహకార పరపతిసంఘములతరపున వ్రాయుపత్రములకు స్టాంపుడ్యూటీ అవసరములేదు. (3) సదరు వ్రాయబడిన పత్రములకు రిజస్ట్రేషన్ ఫీజు సగము మాత్రమే చెల్లింపవలసివున్నది.

3. సహకార పరపతిసంఘములు సర్కారు ట్రెజరీలద్వారా ఒకచోటునుంచి మరియొకచోటుకు చెక్కులద్వారా డబ్బు పంపవచ్చును.

# భారతదేశము-భీమావ్యాపారము

భారతదేశములో ఇండియన్ లైఫ్ ఇన్సూరున్సు కంపెనీసుయాక్టు (1928) ననుసరించిన్ని 1912 సంవత్సరపుఇండియన్ ఎస్యూరెన్సుకంపెనీసు యాక్టు ననుసరించిన్ని 1934 సంవత్సరంప్రారంభములో మొత్తము 282 కంపెనీలు అమలులో ఉన్నవి. వీటిలో 136 కంపెనీలు ఇండియాలోను 146 కంపెనీలు తదితర దేశములలోను ఏర్పరుపబడినవి. ఇండియాలోఉన్న 136 కంపెనీలలోను 60 బొంబాయిలోను 25 బెంగాలులోను 21 చెన్నరాజధానిలోను 14 పంజాబులోను 8 ఢిల్లీలోను మధ్యరాష్ట్రములుఅజ్మీరుబర్మాలలోక్రమముగా రెండేసిచొప్పునను సంయుక్తరాష్ట్రములు బర్మాలలో ఒక్కొక్కటిన్ని స్థాపింపబడినవి. ఇతర దేశములలో ఉన్న 146 కంపెనీలలో యునైటెడ్ కింగ్‌డమ్ (గ్రేటుబ్రిటను)లో 71న్ని, బ్రిటిషు డొమినియన్సు, వలసరాజ్యాలలో 31 న్ని, యూరపుఖండములో 18న్ని, అమెరికాసంయుక్త రాష్ట్రములలో 12ను, జపానులో 9 న్ని, జావాలో 5 న్ను స్థాపింపబడినవి.

ఇండియన్ కంపెనీలలో చాలా కంపెనీలు ఎస్యూరెన్సు వ్యాపారము మాత్రమే చేయుచున్నవి. అల్లాంటి కంపెనీలు మొత్తము 103 ఉన్నవి. మిగత 33 ఇండియన్‌కంపెనీలలో 20 కంపెనీలు జీవితభీమాతోబాటు తదితర భీమా వ్యాపారముకూడ చేయుచున్నవి. జీవితభీమా కాకుండ ఫక్తు తదితరభీమావ్యాపారము సాగించే కంపెనీలు మొత్తము 13 ఉన్నవి.

పైన పేర్కొనిన రెండుచట్టములకు అతీతముగా గవర్నమెంటుఆఫీసులతో సంబంధము కల్గిన కొన్ని పెన్షనుఫండులుకూడ అమలులో నున్నవి. ఇండియన్ పోస్టాఫీసుఇన్సూరెన్సుఫండు కూడ అల్లాంటిదే. ఇండియాలో వ్యాపారము సాగించుచున్న విదేశకంపెనీలలో చాలాభాగము కేవలము భీమావ్యాపారమునే చేయుచున్నవి. మొత్తము 146 విదేశకంపెనీలలో 122 కేవలము భీమావ్యాపారము చేయుచున్నవి. మిగతావాటిలో 10కంపెనీలు జీవితభీమావ్యాపారమును, 14 కంపెనీలు జీవితభీమాతదితర భీమావ్యాపారమును చేయుచున్నవి. చివరనుచెప్పిన 24 కంపెనీలలో 16 యునైటెడ్‌కింగ్‌డమ్‌లోను, 6 బ్రిటిషుడొమినియన్సు వలసరాజ్యాలలోను, ఒక్కొక్కటి జర్మనీ స్విట్జరులండులలోను అమలులో నున్నవి. 1931 సంవత్సరములో భారతదేశములో జీవితభీమావ్యాపారస్థులు మొత్తముమీద 125000 పట్టాలను యిచ్చిరి. భీమాచేసిన మొత్తంసొమ్ము 26⅔ కోట్ల రూపాయలు. వీటివల్ల వచ్చే ప్రీమియమురాబడి 1⅔ కోట్లరూపాయిలు. ఆసంవత్సరము వ్యాపారములో కేవలము ఇండియన్‌కంపెనీలు 97,000 పట్టాలను యిచ్చినవి. భీమాచేసిన మొత్తముసొమ్ము 17 కోట్లరూపాయిలు. ప్రీమియమురాబడి 8/11 కోట్లరూపాయిలు. విదేశకంపెనీలలో బ్రిటిష్‌కంపెనీలు 3⅛ కోట్లరూపాయిలకును, డొమినియన్ వలసరాజ్యములలోని కంపెనీలు 6 కోట్ల రూపాయిలకును, ఒక జర్మను కంపెనీ ⅛ కోట్ల రూపాయిలకును భీమా చేయగలిగినవి.

సగటున ఇండియన్ కంపెనీలు పట్టా 1కి రు1764 చొప్పునను, విదేశకంపెనీలు పట్టా 1కి రు3400 చొప్పునను భీమా చేయగల్గినవి.

1931 సంవత్సరముఆఖరుకు హిందూదేశములోని భీమాకంపెనీలు యిచ్చినపట్టాలు మొత్తము

714000 అమలులో నున్నవి. ఈపట్టాల భీమా సొమ్ము మొత్తము 168 కోట్ల రూపాయలు. వీటివల్ల వచ్చే ప్రీమియము రాబడి 8½ కోట్ల రూపాయలు. ఈ బాహుళ్యమైన వ్యాపారములో ఇండియన్ కంపెనీలు 502,000 పట్టాలకు మాత్రమే జారీచేయగల్గినవి. ఈపట్టాల భీమా సొమ్ము మొత్తము 94 కోట్ల రూపాయిలు. వీటివల్ల వచ్చే ప్రీమియము రాబడి 4½ కోట్ల రూపాయిలు.

ఇండియన్ కంపెనీలలో చాలవరకు జీవిత భీమాను ఆధునిక పద్ధతులమీదనే సాగించుచున్నారు. కాని ఇంకా పంపిణీ పద్ధతిమీద భీమా వ్యాపారము చేసేకంపెనీలు కొన్ని ఉన్నవి. దీనినే (Dividing plan) అందురు. ఈ పద్ధతిలో భీమాసొమ్ము మొత్తము నిర్ణయించుకొనరు. సాలీనా కంపెనీకి సంక్రమించే క్లైములలో ప్రీమియము రాబడి భాగాలమీద భీమా మొత్తము ఆధారపడిఉండును. ఈ పంపిణీ పద్ధతిలో అన్నిరకముల పట్టాదారులకు వారు కంపెనీలో జేరిననాటి వయస్సుతో నిమిత్తం లేకుండా ఒకేవిధమైనచందా ప్రీమియము రేటు విధించవలసి ఉంటుంది. ఇదే దానిలో ఉండే లోపము. ఈ పద్ధతి వ్యాపారసరళి ఎంతమాత్రము పనికిరాదు. పట్టాదారులును కంపెనీఏజంట్లును, దరిమిలాను కంపెనీకూడ కొంతవరకు దగా వ్యాపారము చేయవలసి ఉటుంది. ఇండియాలోని భీమా వ్యాపారమునకు ఈపంపిణీపద్ధతి ఒకవిధమైన శాపమని పలువురు అభిప్రాయపడు చున్నారు. 1912 సంవత్సరపు చట్టము అమలులోకి రాకపూర్వము అనేకమైన కంపెనీలు పంపిణీ పద్ధతి (Dividing Plan) ననుసరించి జీవిత భీమా వ్యాపారము కొనసాగించి తుట్టతుదకు చాలనష్టము లనుభవించినవి. 1912 సంవత్సరపు చట్టము అమలులోనికి వచ్చేముందు ఆ కంపెనీలలో చాలభాగము ఎగిరిపోయినవి. మిగతవాటిలో కొన్ని పంపిణీపద్ధతిమీద పట్టాలనిచ్చుట మానివేసినవి. ఇప్పుడు నూతన కంపెనీలలో కొన్నిమాత్రము పంపిణీపద్ధతి అమలులోపెట్టినవి. కాని అనతికాలములోనే ఇవికూడ వాటితప్పును తెలిసికొన వచ్చును.

ఇండియన్ జీవితభీమాకంపెనీలు కొన్ని వాటి ఆఫీసులను బ్రిటిషు తూర్పుఆఫ్రికాలోను, ఇంకా దగ్గిర తూర్పుదేశములలోను పెట్టి వ్యాపారమును సాగించుచున్నవి. 1931 సంవత్సరములో ఇతరదేశములలో ఇండియన్ కంపెనీలు, మొత్తము 60 లక్షలరూపాయిలకు భీమా చేయకల్గినవి. వీని ప్రీమియము రాబడి 4 లక్షలురూపాయిలు. 1931 సంవత్సరము ఆఖరు రివర్సనరీ బోనసులు అన్నికలిపి కొని మొత్తము 4 కోట్లరూపాయల భీమాచేయగల్గినవి. వీని ప్రీమియము రాబడి 21⅓ లక్షల రూపాయలు.

1931 సంవత్సరములో ఇండియన్ కంపెనీలు విదేశకంపెనీలు కలిసిచేసిన నూతన ఏన్యూయిటీ వ్యాపారము సాలుకి50,000 రూపాయలు 1931 సంవత్సరము ఆఖరుకు అమలులో నున్న మొత్తము ఏన్యూయిటీ సాలుకి 3½ లక్షలరూపాయలు. వీటిలో ఇండియన్ కంపెనీలు యివ్వవలసిన మొత్తము 1⅓ లక్షల రూపాయలు.

1929 సంవత్సరమువరకు అప్పటికి 11సంవత్సరములనుండి క్రమేణ అభివృద్ధి చెందిన ఇండియన్ కంపెనీల జీవితభీమా వ్యాపారము 1930 సంవత్సరములోసర్వవ్యాప్తమైన ఆర్థికదుస్థితి ఫలితముగా కొంచెము దెబ్బతినినది.

బలమైన పునాదులేమీ లేకుండ నూతనంగా బయలుదేరిన చిన్న చిన్న కంపెనీలు కొనసాగించిన నూతన వ్యాపారము అనతికాలములోనే అడుగంటినది. కాబట్టి ఆకంపెనీలుచేసిన వ్యాపారము ఆట్టే అంత లెక్కలోకిరాదు. 1931 సంవత్సరములో 7½ కోట్లరూపాయిలు విలువగలిగిన వ్యాపారము ఆపివేయవలసి వచ్చినది. నూతనముగా కొనసాగించిన వ్యాపారములో నూటికి 40 చొప్పున ఆపివేయవలసి వచ్చిన దన్నమాట.

1931 సంవత్సరములో ఇండియన్ కంపెనీలకు జీవిత భీమా వ్యాపారములో ప్రీమియములవల్లను వడ్డీలవల్లను వచ్చిన నికరాదాయము 5¾ కోట్ల రూపాయిలు. అంతకుక్రిందటిసంవత్సరముకన్న ½ కోటి రూపాయిలు ఎక్కువ వచ్చినదని గ్రహించవలెను. 1931 సంవత్సరములో క్లైముల మొత్తము 1½ కోట్ల రూపాయిలు. అంతక్రిందటి సంవత్సరముకంటె 12 లక్షల రూపాయిలు ఎక్కువని గ్రహించవలెను. మరణముల వల్ల కలిగిన క్లైములు 5లక్షల రూపాయిలకును జీవించి యున్నవారి క్లైములు 7లక్షల రూపాయిలకును క్రమముగా హెచ్చినవి.

1931 సంవత్సరములో జీవిత భీమా ఫండులు 2 కోట్ల రూపాయిలు హెచ్చినవి. 1931 సంవత్సరము ఆఖరుకు జీవితభీమాఫండుల మొత్తము 22½ కోట్ల రూపాయిలు జీవిత ఫండులమీద ఆర్జించిన సగటువడ్డీ నూటికి 5½ రూపాయిలు.

ఇండియను కంపెనీల మొత్తము లాభాలు 29 కోట్ల రూపాయిలు స్టాకు ఎక్స్చేంజి సెక్యూరిటీలలో చాలా భాగము నిల్వచేయుబడిఉన్నది. విదేశ స్టాకు ఎక్స్చేంజి సెక్యూరిటీలలో నిల్వచేసినది. ½ కోట్ల రూపాయిలు మాత్రమే. మిగతసొమ్ము హిందూదేశములోనే లాభదాయకములైన పద్ధతులలో వినియోగింపబడుచున్నది.

(ఇండియన్ ఇయర్ బుక్ - నుండి)

వేలివెంటి సుబ్రహ్మణ్యము, బి. ఏ.

## విజ్ఞప్తి

### వ్యాసకర్తలు

వ్యాసకర్తలు తమ వ్యాసములను, స్ఫుటముగా పేజీకి ఒకవైపునవ్రాయ గోరుచున్నాము. వ్యాసములు భీమా వ్యాపారమునకు సంబంధించినవై యుండవలెను. ప్రకటింపబడని వ్యాసములను తిరిగి పంపగోరువారు తపాలబిళ్లలు పంపినగాని పంపబడవు.

మేనేజరు, భీమాపత్రిక.

### భీమా ప్రచారిణి పత్రిక

గుంటూరునుండి బెజవాడకు మార్చుటకు యేర్పాట్లు జరుగుచున్నవి. డిక్లరేషన్ అయిన తరువాత ప్రచురించబడును.

# The Business of Life Assurance

By D. C. DAS.

The business of Life-Assurance can very well be described as the tug-of war between Economy and Investment. Like Banks and other Co-operative concerns, Life Assurance Companies also are safe custodians to make deposits in the form of scientific savings. They are floated by the people and for the people. They are institutions run thoroughly on scientific basis under the strict control of the State. The business of Life-Assurance has possibilities as great as any other of modern times. The task of putt ng a new Life Assurance Company on its foot-hold and swinging it into proper working order is no easy one. Solid capital is necessary to enable the Company to tide over the stages of early years before the premium income has grown to no insufficient dimensions to cover running costs and the essential expences connected with Office managment as well as field organization; the business secured always be carefully scrutinized to avoid the danger zone of a disproportionate number of death claims making an inroad on capital resources that need to be conserved for many other purposes and greatest of care must be excercised to see that some new branches are at the out set opened only in places where they will very soon commence to pay their way. The golden mean must be struck between incurring ravages of expense in order to obtain a huge volume of business, much of which may be lost subsequently due to lapsing, and excessive caution that very often results in a Life Assurance Company languishing instead of expanding and in consequence, continuing to show a high ratio of expenses because the income in premium money has not grown to such an extent as should be to make the burden of standing and overhead charges a relatively light one. In a previous article I have discussed about field organization. Let us, in these pages, turn our attention to the internal administration of the business proper with special reference to Company Valuation.

### Periods ot Valuation.

Now, as a rule, the assets and liabilities of Life Assurance Companies are worked and valued by technical experts at terms and at periods. This valuation is done in some cases year after year, where it is technically termed "Every year a Bonus year". In some cases, after two years, when it is called Biennial Valuation. In some cases, at an interval of three years called Triennial Valuation. At times, after a lapse of four years, called Quadrennial Valuation. While in others, after a break of five years, known as Quinquennial Valuation. The necessity for such sort of terminal Company Valuation arises principally for two reasons viz, (1) on account of the fact that now-a-days. Life Assurance business is conducted on level annual premium and single premium basis, and also (2) on account of the fact that all the assumptions, as to future trend of mortality, interest and expenses made at the time of premium calculations are not identical with those experienced by Life Assurance Companies from time to time.

### Pre-Historical practice

To trace back to good old days and to turn to the pages of wisdom of ages, we find, that the transaction of Life Assurance business was carried on a basis known as Assessment basis. According to this system the premiums

charged varied from year to year and depended for each age at entry only on the mortality rate of that particular age. To all those persons entering that age, premiums were charged taking into account the actual amount required to cover the risk between two particular ages plus a small sum proportionate to the expenses of Office management. So, the premium money that a person has to pay to covering his life permanently will increase with the advancing of years as the probability of his dying increases with his ageing in years. In each year, the premiums received are just sufficient to meet the claims and expenses in that year, so that nothing in the shape of reserve is needed except to cover the unexpired risks. And as no reserves are accumulated no Surrender-value is allowed to policy-holders. The fact that persons who entered while young and who were unfortunate in living for long period, had to pay very high rate of premiums to continue their policies soon made this system of Life Assurance business very unpopular. Now-a-days, this system of Assessment method has become obsolete and that to the best interest of both the policy-holders and the companies concerned, in as much as, to avoiding the thousand-and-one difficulties and inconveniences accrued therefrom.

### Methods more popular and practical

Later on, and soon after the middle of the eighteenth century, the level annual premium and single premium method of Life-business was adopted. At the present time all the large volume of big amount of Life Assurance business done every year throughout the length and breadth of the commercial globe is transacted under the single premium method or the level annual premium method. The guiding principle and the science involved in both is exactly the same. The accumnlation of the excess premiums, paid in addition to the amounts required to covering current risks during the preliminary years of the policy, at rate of interest not under an assumed one and utilizing this hoarded reserves in the later years of the policy will be in force.

### Calculation of premiums

The calculation of single premiums are made on the assumption of a specific mortality table and on the assumption that the excess of the premiums after deducting the current risk premiums year after year, in the early stages of the policy, will earn a rate of compound interest not under an assumed one during the whole of the term of the policy. Thereafter, the calculation of the level annual premiums are made as the value of an immediate annuity due whose present value is the single premium as calculated above. In the present method of level annual premium of Life Assurance business, it is even otherwise clear that there should be a saving fund of hidden reserve element. As, with the increase of age, the possibility of a person's dying increases every year, with what is called mathematical precision. And it can be expected that the same premium money will cover from year to year, protection, all through, as long as the policy will be in force. Therefore, it is natural that the premiums paid in the early years of the duration of the policy are much in excess of what is exactly necessary to cover the risk alone and the accumulation of this excess at compound interest for use in the proceeding years of the duration of the policy when the premiums paid will be much less than even to cover the then current risk, constitutes the reserves of a Life Assurance Company. This is the phenomenon as distinctive of Life Assurance from all other forms of

Insurance where the creation of reserves springs from no desire to improve on the safety and security offered than from any other theoretical requirements, excepting for the unexpired portion of the risks.

**Implication of premium calculation**

It would be better to give the readers a clear idea of the first priciples involved in the calculation of Office premiums of a Life Assurance Company; before writing to expiain the fundamental principles implicated in the valuation of the assets and liabilities of a Life Assurance Company. (1) Interest, (2) Loadings and (3) Mortality are the threefold elements that enter into the calculation of office premiums.

Interest rate comes under consideration, on account of the fact that Life Assurance Companies have earned interest on the reserves built out of premiums received, so such a net rate of interest, less income-tax, should be assumed as the Company is likely to earn in the future.

Loadings, in the shape of additional are considered essential to cover the commission and management expenses to safe-guarding the Company against adverse fluctuations in the interest and mortality rates assumed, and to provide for profits and share-holders' best interest.

Mortality enters into account, in case of Endowment Assurances on account of the fact that due allowance must be made for the chances of having to meet a claim by death in the fi st year and each subsequent year of Assurance and for the chance of the Life surviving the period. So, the mortality table to be chosen should be one whose rates will closely approximate to those which will operate in future.

Of the above three elements, the two elements that of Mortality and Interest will only enter into account and the premiums thus obtained is called the net or pure premium; if no expenses are incurred in the transaction of Life Assurance business; if the rates of the mortality and interest assumed were certain to operate in the future without any deviation and if no profits are to be provided for policy-holders and share-holders. But in practice, this is not possible.

**The necessity for valuation.**

The necessity for terminal Valutions of liabilities will not at all arise if the company experiences exactly identical mortality rate, earns the identical rate of interest as those assumed in the calculation of premiums and spends exactly the amount of loading used for that purpose, even in cases of single premium and level annual premium methods of transacting Life Assurance business. The reserves required will just be the accumulated differences of income and outgo year after year, if such an ideal and theoretical assumption comes to happen. But an ideal condition as this, can seldom happen particularly on account of the fact that the duration of the Life Assurance contracts being very long and the difficulties involved in the prediction of future trend of the interest and mortality rates. As to mortality and interest rates, circumstances are continuously changing sometimes in favour of the companies and at times against the companies. So the balance of funds as determined by the excess of incomes over outgo together with future premiums may or may not be enough to meet all the liabilities under all the current contracts. Due regard being paid to the interest and mortality rates that may be experienced during the

future, it is to ascertain the exact state of affairs and to work out accurately, the amount of reserves that are to be kept. That for this purpose, highly qualified Actuaries are engaged term after term to make Valuation of the companys' Assets and Liabilities.

As a result of such Acturial Valuation if it is found that the fund of the Life Assurance business on the day of valuation run in excess or at least is equal to the reserves required under the valuation bases, the Life-fund is said to be solvent and the excess of the Life-fund over the reserves thus made out is known as Surplus, which in the form of Bonus, is distributed to the policy-holders in due proportion and in the shape of Dividends on the share-capital is allotted to the share-holders of the companies, in due reciprocity. In the event of Life-fund being below the reserves thus required, then it is said that a deficit must have occured and the Life-fund should be closed, and hence forward no new business should be secured. Other aspects of the business will be dealt with in the next article. *( Insurance Herald. )*

## APPRECIATIONS

**GUPTA & Co.,**
AMALAPURAM.
East Godavary Dt. 20-11-1936

*Agents for* :—The Crown Life Insurance Company, Toronto - Canada
*Suppliers for* :—High class Watches, Musical, Sporting, Electrical, Goods and Fountain Pens etc

***Reliable Goods for Rock Bottom Prices,***

M. R. Ry.,
**S. Kanaka Raju Pantulu Garu,**
BEZWADA.

Dear Sir,

Your monthly magazine Bheema Patrica contains very nice articles for the Agents. I have been regularly getting the same, month after month, and I find it very interesting and instructive to the Agents of the several Insurance Companies.

Wishing you success,

Yours faithfully,
(Sd). K. S. RANGANAYAKULU GUPTA.

Reg. No. M. 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.